యోజకుఁ దెచ్చునాఁకొ మరుఁ డుద్ధతుఁ డోర్చునె ముద్దరాలు ! వి
భ్రాజితదివ్యమూర్తివి కృపన్ సెలవిచ్చినఁ బోయివచ్చెదన్. 234

మానిని. కోకిల కీర బలాక కులార్భటిఁ గొందల మందెడిడెందమునన్
దీకొను గంధపుగుబ్బలిఁ బ్రమ్మిన తెమ్మెరతావుల యుమ్మలికన్
పైకొని చిన్నెల యన్నులవెన్నెల పర్విన నోర్వఁగ వేదనచేన్
ఆకలవాణి తపింపక యుండునె ? మానినిమోహన లోకపతీ ! 235

కం. అని నీలవేణి పలికిన
వినయోచితవచనరచన విని యుత్సాహం
బున హృదయ మలర నవ్వుచు
వనజాక్షుం డిట్టులనియె వనితామణితోన్. 236

ఉ. సంగతిమీఱ సభ్యులు ప్రసంగవశంబున మెచ్చుచున్న నీ
శాంగన రూపసద్గుణ సుధాంబునిధిన్ మదిఁ జింతయున్న న
న్నంగభవుం డెఱింగి కుసుమాస్త్రము వేయఁ గలంగినాఁడ నా
రంగ లవంగలుంగ వనరంగవిహారము గల్గె ! కోమలీ ! 237

ఆ. ఇంగితజ్ఞురాల ! యిఁక వేయు చెప్పంగ
నేల యేనయటకు నేగుదెంచి
క్షితితలేంద్రతనయఁ జేకొనియెద వేగఁ
జనుము చెలియ సంతసమున నెనయ. 238

వ. అనుటయు. 239

కం. స్వామీ ! మా రాతనయకు
సేమం బొసగంగ ముదము చెన్నువహింపన్
శ్రీముఖపత్రిక యొసఁగుము
నా, మధుదైత్యాంతకుండు నగుచుం బలికెన్. 240

ఉ. అంచిత సౌరభ స్ఫురితమైన మృగీమదకర్దమంబు సీ
లించి సమంచితాత్మనఖలేఖనిచే నొక వృత్తపద్ధతిన్

గాంచన కేతకీ కుసుమగర్భదళమ్మున వ్రాసి లేఖ కి
వ్వంచు నొసంగె నాతట మురారి సువాణికి నీలవేణికిన్. 241

వ. అని యిత్తెఱంగున రంగపతి యానతియిచ్చి విహంగపుంగవ సమర్పితంబగు లేఁజివురులం బొదివిన కుసుమమాలికానిచయమ్ము నీలవేణికి సబహుమానమ్ముగానొసంగి నీలావధూమణి నూఱడింతువుగాని పొమ్ముపొమ్మని యానతిచ్చిన నెలంతశ్రీకాంతునకు మ్రొక్కి యమ్మహాత్మునిచేత ననుజ్ఞాతయై సభమ్మునకు నుద్గమించి చను నెడ నంతనట నీళావధూటి విరహభారపరిశ్రాంతయై యుండుటం జేసి నెచ్చెలులతోనిట్లనియె. 242

శా. ఆకల్లార్పఁదొడంగె మందపవనుం డందంద సూనాస్త్రభృ
ద్రాకాచంద్రులు దోడ్పడన్ గినుకచే, రానోపునే! తద్భయో
ద్రేకక్షాంతికి నీలవేణి, విభుఁ డొత్తెఱంగ నేగన్ బనుల్
గాకున్నన్ గద రాకయున్కి యని యక్కంజాస్య చింతింపఁగన్. 243

వ. అనిన నచ్చేడియతో నెచ్చెలు లిట్లనిరి. 244

కం. బాలామణి! మది నెఱుఁగక
నీలో వగపేల కార్యనిర్వహణకళా
శాలినినై సేమంబున
నీలోనన నీలవేణి యేతేఱంగన్. 245

సీ. చొఱనీయవలెగదె శుద్ధాంతమందిర
ద్వారసంస్థిత మహోదగ్రభటులు
నెడమీయవలెగదె యిందిరావిభుఁ గొల్వ
బడిబడి నేతెంచు భాగవతులు
మాటాడవలెగదె మదనమోహనమూర్తి
తేటకన్నుల నింతిఁ దేఱిచూచి
తలయూఁచవలెగదె తగినకార్యంబంచు
తాల్మి చేవలయూరు తల్లిగారు
తే. తెలివి నూహింప నిన్నిపట్టుల నిజప్ర
సంగభంగుల నవరించి రంగవిభుని

మానసమ్మున నీమీఁది మమతఁ జేర్చి
వేగ నేతెంచు మననీలవేణి యబల! 246

వ. అని యిత్తెఱంగునఁ జెప్పి రనిన గురువర్యునిం జూచి శిష్యప్రవరులు తలువాతిచరితం బెట్టిదనిన వినుఁడని చెప్పఁదొడంగె. 247

శా. సుగ్రీవానిలనందనాది సుభటస్తోమప్రియోత్సాహ! పం
క్తిగ్రీవేంధనవీతిహోత్ర! విబుధక్షేమావహా! శంకరో
దగ్రేష్వాసనిరాసభాసుర! జగత్ప్రఖ్యాతచారిత్ర! ర
త్నగ్రైవేయకముఖ్యభూషణ లసత్సౌందర్య పాథోనిధీ! 248

కం. రాజద్రాజతనగ సుర
రాజేభాజాశ్వ భుజగరాజ త్రిదివ
త్కుజ మృగరాజ ధవళాం
భోజ ద్విజరాజ సదృశ పుంఖితకీర్తీ! 249

మాలిని. అనుపమగుణసాంద్రా! హంసవంశాబ్ధిచంద్రా!
వినిహతరిపుసేనా! విప్రపుత్రాసుదానా!
మనసిజరిపుకాయా! మానుషార్చావిధేయా!
జనకనృపకుమారీ! సమ్యగానందకారీ! 250

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణానిరీక్షణ సమాసాదితకవితావిశేష శేషాన్వయ ప్రదీపక వేంకటాచార్యకుమారక రఘునాథాచార్యప్రణీతంబైన కులశేఖరమహీపాలచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము. 251

# కులశేఖర మహీపాల చరిత్ర

## చతుర్థాశ్వాసము



శ్రీరమ్యమకుటరత్న
స్ఫారద్యుతి విజితభానుభానువ్రజ ! లో
కారాధకీర్తిసౌరభ !
సారగుణావేశ ! జనకజాహృదయేశా ! 1

వ. అవధరింపుము గురుసద్యుండు శిష్యులకిట్లనియె నట్లన్నెలంత విరహభారమునఁబొరలుచున్నయెడ. 2

### నీలవేణి సీతాదేవియొద్దకు వచ్చుట

మ. హరిహస్తాబ్జ నియుక్త నూత్నకుసుమోద్యన్మాలికావాసనల్
సరవిం బైపయిఁ గ్రమ్మ దేరఁ జెలులాశ్చర్యమ్మునన్ నల్దెసల్
బరికింపన్ దివి నీలవేణి ననువొప్పన్ గాంచి రచ్చో నభో
తరనిర్యన్నవచంద్రరేఖయన నుత్సాహమ్మువాటింపగన్. 3

ఉ. రంగవరేణ్యదత్త సుమరాజి సువాసన ముమ్మి సంగఁగా
నింగి దొలంగి వేదన మునింగి మనంబుగలంగియున్న నీ
లాంగన సంతసిల్ల ధర సంభ్రములిడన్ డిగివచ్చు నీలవే
ణిం గని బాలికామణుల నెమ్మనముల్ వికసించెఁ గ్రక్కునన్. 6

ఉ. కాంచితిఁ గాంచనాంబరు వికస్వరవిగ్రహుఁ గాంచికాగుణో
దంచితమధ్యు రంగవిభు నద్భుతమంచుచుఁ జెంతసేరి సే
వించితి నీదు రూపగుణవిభ్రమవైఖరి సారెసారెఁ గీ
ర్తించితి నిన్నతం డరుగుదెంచి వరించుట సంఘటించితిన్. 7

కం. అను పల్కు లమృతరసమై
తనవీనులఁ జొచ్చి హృదయతాపముడుప న

మ. పటుగతి నేగుచో నెదుట బారులుదీఱు చకోరకమ్ము లు
త్కటరవ ముల్లసిల్లఁ దమడాపలనుండెడు పిల్లపిట్టల సుం
దట నెగువంగ సారసముదంచిత కోమలచంద్రికావళిన్
గుటుకుట గ్రోలుచుండె గనుగొంటె మరిట సారసమ్ముగ్గలింపఁగన్, 17

వ. అంతఁ గడచి చనుచున్నయెడ విభవాధారసభాసురంబగు మేరునగమ్ము చందమ్మున మహాభాగవతమణిమందిర మాలికాలంకృతంబైన రంగనగరంబు దవ్వుదవ్వులం గనంబడియె నంత భేరీపటహ శంఖాదినినాదమ్మును నటనటీజనప్రవర్తిత వేణువీణాగానరావంబులును మహాభాగవత ముఖోదీరిత దివ్యప్రబంధానుసంధాన ధ్యానంబులునుం గలసి వీతెంచిన నమ్మహావైభవంబునకు నద్భుతంబంది వినుచున్నంత నామనంబున. 18

కం. ఇట్టిమహావిభవంబున
నెట్టణ విలసిల్లు రంగనిం గనుచందం
బెట్టిది చెలికత యే నే
పట్టున వినిపింపనేర్తు బహుసంఘములో. 19

వ. అని వితర్కించుచున్నయెడ. 20

కవిరాజ. సలలితకీర్తి పొసంగెడువేళ విచారముపొందెద వల్లదిగో!
ఫలకుసుమాసవ సౌరభవైభవ భాజన భూజసమాజములన్
బొలుచు వనంబు కనంబడుచున్నది పొందుగ నందు ఖగేంద్రునితో
నెలమి వసించె రమారమణీవిభుఁ డిందుముఖీ! చను మచ్చటికిన్. 21

వ. అని యశరీరి యాదేశించిన పలుకులకు డెందం బానందకందళితంబగుటయు గగనపథావతరణమ్ముచేసి యవ్వనంబు చేరంజని యందుఁ బ్రసవవిసర విలసితంబులై పొదలు పొదలలోనం గూర్చున్న యన్నళినలోచను నాలోకించునప్పుడు నామనంబున. 22

కవిరాజ. అలికులవేణుల వేణులకుం విరు లాకసి తాఁ గొనివచ్చుటకై
యళికుల మాకులమందఁగ నిప్పని యప్పనికిందగు నే యనుచున్
దలఁచితిఁ గ్రమ్మఱఁ దోఁచె నెఱుంగక తప్పఁదలంచితి నీతనికిన్
గలుగరె భృతులు దీనికి వేఱొకకార్యము గల్గునటంచు మదిన్ 23

కం. కని నేను నమ్మహాత్ముని
గనుగొనుచున్నంత విపులకాంతా నికరా
ననా శాంతిం బరించుట
కనసమ్యాన్ మదుగు పాపకస్మాగ్య గాగ్రణీ! 24

సీ. రమణీయసుమరజోరాజ రాజిలుచోట
సొలయుచు నేళించి తొలఁగునమ్మ
లలితకోకిలశుకాలాపముల్ వీతేర
గరములఁ గర్ణముల్ గ్రమ్మునమ్మ
మృగనాభిసారభోన్మేషపాంకవశిలా
వితతుల డాయంగ వెఱచునమ్మ
ఘనచంద్రికాజాలకలితస్థలమ్ములఁ
నులికి వృక్షచ్ఛాయ నొందుగునమ్మ

తే. గుంజదళిపుంజ కలహంసకోకనిచయ
రుచిర నవపద్మకుముద సరోవరౌఘ
మిళిత మరుసంకురములకుఁ దలఁకునమ్మ
యంగజాక్రాంతచిత్తరంగవిభుండు. 25

కం. అదియెల్లఁ జూచి నామది
నొదవె విచారమ్ము విరహయోగశ్రమ మి
ట్టిదకాదె యితనిమది యే
మదిరాననయందుఁ జెందె మమతదలిర్పన్. 26

మత్తకోకి. సంగతంబగుచుం దరంగము సైంధవంబగుగాని తా
రంగమే జలరాశిలోకము రంగభర్తృకృతమ్ముగా
నింగితజ్ఞు లెఱింగి కొల్చెద రింపుసొంపు వహింప న
య్యంగహీనుఁ జెఱుంగఁ డంగ రథాంగపాణి నలంచెడున్. 27

ఉ. ఈమహనీయమూర్తిమది యేమదిరాననయందుఁజెంది వి
శ్రామములేక నెవ్వఁగఁ బొసంగిచరించెనో! చూచిచూచి యే
నేమని మాలతాంగి కతలేర్పడఁ జెప్పుదు! నిప్పుడీ గుణ
గ్రామణి పల్కునే యిది యగాధమనోరథ మేమిసేయుదున్. 28

తే. అనుచు సుదినంబు శయనంబుగా సచటనిలిచి
పంకజంబులకు దగఁ జేసి కలుగకుడుగు
మంజుసుమపుంజ మాధవీకుంజ మొకటి
మార్గముననుండి చెంతనిలిచితి మగువలార ! 29

కం. అంత ననంతశయనుడ త
నంతవరేఖ్యుండు కుసుమకోమలశయ్యా
భ్యంతరమున నునిచి పరి
శ్రాంతి యుడిపె నిజగరుద్వ్యజన పవనమునన్. 30

కం. అతఁడు గూర్చుండునప్పుడు
కౌతుకక నన్నెంచ నేలఁ గులశేఖరభూ
పతితనయా ! యని విరహా
న్వితచిత్తుండగుట మతియు నిను బేర్కొనియెన్. 31

వ. అప్పలుకులు నాకుం గర్ణగోచరమ్ములగుటయు నామనమ్మున విస్మయంబొదవ నొక్కింత విచారించి యిమ్మహాత్మ్యుం డమ్మదవతిజూడకుండియు న్నపసన్నిధికిం జనుదెంచు సుధీమణు లయ్యంతిం జూచుచుండుదురుగావునఁ దత్సౌంద ర్యాదిగుణమ్ము లిమ్మహాపురుషుని సన్నిధానంబున నుగ్గడించుకతంబున నితండు నీలాంగనాపరిష్వంగసముత్సుకితాంతరంగుడై కుసుమశరవేదనాపరిశ్రాంతుండయ్యెం గావలయునని నిశ్చయించి మతియును. 32

కం. సార్థక మే నరుదెంచుట
నిర్ధారితమయ్యెఁ గార్యనిర్వాహము పు
ణ్యార్థి వెస నాడఁబోయిన
తీర్థ మెదురొక్కనుట యని మదిన్ ముదమొదవెన్. 33

మ. కలకంఠీమణి ! యప్పుడేనతని యుత్కంఠన్ వితర్కించి ద
వ్వులచూడ్కిన్ బని యెట్టులో నతనిచెయ్యాల్ భావమున్ గాంతు నం
చలరుందూఁపులవేల్పు తండ్రికడ కే నందంద డాయంగఁ బ్రా
న్తలరాల్గూర్చిన తిన్నియన్ జివురువన్నె ల్మించు తల్పమ్మునన్. 34

సీ. శతపత్త్రపత్త్రవిస్తారము మించిన దయో
　　దారం విశాలనేత్రముల వాని
ఘనరత్నదర్పణపాళి నోడించు
　　లలితకోమలకపోలముల వాని
జలధినిర్ణిద్రస్ఫురత్ఫలకమ్ము నిరసించు
　　సముదీర్ణ విపులవక్షమ్ము వాని
వికసితరాకాసుధాకరశ్రీ నేర్చు
　　భాసురవదనబింబమ్ము వాని

తే. హారకుండల ముకుటకేయూర కౌస్తు
భాంగుళీయక కాంచికాద్యతులరత్న
భూషణోజ్జ్వలవిగ్రహు బుధమనోని
వేశితుని రంగవిభుని గాంచితి లతాంగి! 35

చం. సదమలభక్తిచే సతని సారసతుల్యపదద్వయంబు వా
లయము గదియంగ మ్రొక్కి మఱలన్ గనుదోయికిఁ దత్సమగ్రతే
జము మిఱుమిట్లుగొల్ప భయసంభ్రమముల్ మదినగ్గలించి తా
లిమి చెడి యొక్కతీవఁ గదలింపుచు మోమఱవాంచి నిల్చితిన్. 36

ఆ. వె. నామనోభావ మెఱిఁగి నారాయణుఁడు చిఱు
నగవు మిగులఁ బల్కె మగువ యిచటి
కేమిదలఁచి వచ్చి తెవ్వరుబనిచిరి
వెఱవనేల దెల్పవే మృగాక్షి! 37

వ. అనిపల్కు నమ్మహాత్ముని సంభాషణమ్ముల వలన ధైర్యం బవలం
బించి కరంబులుముకుళించి యిట్లని విన్నవించితి. 38

ఆ. వె. హరి జగన్నివాస హాటకవసన ర
మావిహార నాదుమనవి యొకటి
కలదు చిత్తగింపవలయు నీదగు దయా
మృతవిలోకనములు మెండుకొనఁగ. 39

సీ. సర్వసర్వంసహాచక్ర నిర్వాహణశ్రీ
ధౌరీ సముద్ధృత నిజోద్యద్భుజాగ్రుఁడు
దీపితకీర్తికన్యా పదన్యాస శి
హ్యస్విత్వ శిథిలదిగంతరుండు
చటులకోదండ లస్తకవినిర్గత శరా
సార మోహిత శత్రుసముదయుండు
సతతానుగత భాగవతబృంద వందనా
చార సత్కారనిష్ఠాఘనుండు

తే. గీ. దివ్యవేదాంత గుంఫితార్థప్రపంచ
పరిచయావాప్త విజ్ఞాన పరిణతుండు
సకలజన పాలనోత్సాహశక్తి ధరుఁడు
వెలసెఁ గులశేఖరాహ్వయోర్వీవిభుండు. 40

ఉ. ఆమహనీయ తేజునకు నద్భుతశీలగుణప్రసిద్ధయై
శ్రీమహిళానిభద్యుతులఁ జెల్వముగాంచి జనించెఁ బుత్రి సు
త్రామపదమ్మునందు వసుధాస్థలి రాజగృహమ్ములందు క
న్యామణులెంచ జేసి సరియౌదురె! కేరళరాజకన్యకున్. 41

కం. అసమశరు కుసుమవిశిఖా
ల్లసనము నోడించుసుతను లావణ్యశ్రీ
నెసఁగు చెలికి నీళాహ్వయ
మసదృశవిభవమున నొసఁగె నవనీపతియున్. 42

కం. సిరిమించు లక్షణమ్ముల
సురుచిర లావణ్యశీలసుగుణశ్రేణిన్
సరవిఁ బెనుపొంది యున్నెడ
సరసవయోరేఖ దనరె సరసిజముఖికిన్. 43

చం. జనకుని సన్నిధానమున సమ్యగుపాగత వైష్ణవాస్యసం
జనిత భవద్గుణామృతము సారెకు వీనులఁ గ్రోలుచున్న య
య్యనుపమగాత్రి నిన్ను హృదయమ్మున నాథునిగా భజింపుచున్
ఘనవిరహాగ్ని తాపమునఁ గ్రాఁగుచునున్నది రంగవల్లభా! 44

క్ష్మాపాలుల్ మెచ్చఁ బరిగ్రహింతు ననుసౌభాగ్యంబొప్పఁగన్ భృంగరీ
లాలోలాలకలాంగి శ్రీలలిత ! సిరిసీమాసమానాగమా. 51

వ. అనుచుం జదువుచున్నపుడు నామాక్షరవ్యత్యయమ్మునకు వితర్కించుచు సమయమ్మున నెచ్చెలు లిట్లనిరి. 52

చం. మనవ విచారమేల ! వనమాలి మనోభవబాధితాంగుఁడై
సొగయుచు వృత్తిలేఖ నొకచో నొప్పున వ్రాయుచునుండి యంత నీ
దగునభిధానవర్ణము లుదంచితలీల లిఖించుచోటఁ జె
ల్లెగసిన మోహసంతమ మిట్లు రచింపఁగఁ జేసెఁ గోమలీ ! 53

వ. అని ప్రౌఢకాంతలుపన్యసింప వారల తదర్థావబోధనంబునకు సంతసిల్లి రాజకన్యక వికసితముఖకమలయై నీలవేణిం జూచి. 54

సీ. పద్మసంభవముఖ ప్రార్థనీయపదంబు
నిలిచి మాటాడెనె నీలవేణి !
సకలవేదాంత సంచారస్వభావంబు
నెలవు జేరితివశే ! నీలవేణి
శతమఖప్రముఖ పూజితపదాంభోజంబు
నిను సత్కరించెనే ! నీలవేణి
కవిబృహస్పతి కృత స్తవ భవ్యచరితంబు
నీనుతుల్ మెచ్చెనే ! నీలవేణి
తే.గీ. నాగశయనుని దర్శించి నాదుమనవి
వితతముగ విన్నవించి సమ్మతునిఁ జేసి
యెలమిఁ దెచ్చుకొంటి ననునిర్వహించి తీవు
నీదు ఋణమెట్లు దీర్తునే నీలవేణి ! 55

వ. అని పొగడుచు నయ్యింతిం గౌఁగిలించికొని సంతోషమ్మునం బొదలుచున్న యెడ సఖిజను లారాజకన్యం గనుంగొని. 56

సీ. మనలఁ జూచుచు నీవమున్ బ్రాతఁ గేకల
  నడలఁజేయకయున్న యదిశిఖండి
ననల రోయుచుఁ బరాకున నున్నఁగూయదే
  కాకి పెంచిన కెంపుగంటి పులుగు
నాకచోటఁ గాలుసిల్వాక లతాంగుల సేనఁ
  బూని క్రమమ్ముల సోకంబూత మదిమె
యొక్కటొక్కడి ఛాయ ప్రక్కలు మైనిండి
  నిక్కుచుండెనఁ బద్మినీవిరోధి

తే.గీ. మరుని గాడిలిచుట్టముల్ మనకుహితులె
విరహిణుల నేతు రిచ్చోట విరులతోట
వెడలి నీదగు మహనీయ వివిధరత్న
చిత్రకాంచన సౌధమ్ముఁ జేరవలయు.

వ. అనుచు నమ్మానిని మేననుండిన సుమనోరజమ్ము కరమ్ములం దుడిచి శీతలసలిలమ్ముల ముఖమ్ముగడిగి తిలకమ్ముదీర్చి కరమ్ముబట్టి లెమ్ము లెమ్మనుచు లతాంగులునీళాంగనం బొదివికొని చరణశింజానరవమ్ము పిక్కటిల్ల హంససందోహమ్ము నడచుకరణి మందగతిం జని మహనీయసౌధాంతరమ్ము సొచ్చి యుచితగతి నివసించియుండిరంత. 58

## మంత్రుల దుర్మంత్రము

ఉ. శీలగుణోజ్జ్వలుండు కులశేఖరభూవరుఁ డాత్మమంత్రి వా
గ్జాల మనిత్యలౌకికవిచారఫలం బదియేల నంచు ల
క్ష్మీలలనామనోహరు విశిష్టకథాశ్రవణమ్ము మోక్షదం
బై లలినొప్పు నట్టిది మహాత్ములసన్నిధిఁగాని కల్గునే! 59

వ. ఇవ్విధంబున మనంబునం దలంచి శ్రీవైష్ణవసన్నిధానంబున నిరంతరంబును భోగ్యకాలక్షేపమ్ము సలుపుచుండె నయ్యవసరమ్మున నిజప్రభుప్రియసంభాషణాభావజనితక్రోధమ్మగు మంత్రియూథమ్ము దమలోన. 60

కం. శ్రీవైష్ణవులితెఱఁగున
భూవరునిం బొదివికొని బుభుప్రవరుల్ కరం

గ్రోసియుటః రెధిపుఁ జూచెం
గా పశేమే! మనకు రాజకార్యప్రౌఢిన్. 61

కవిరాజ. అనుచు సమహాత్మ్యు లుపాంశువిచార సమన్వితదుర్ద్మియున ద్రమతై
ఘనులకు రాజునకుం గలనైయ్యము గాసియొనర్చు నుపాయముచే
మనముల నొక్కొకచేతఁ దలంచి సమగ్రజలాశయవక్రగతిన్
దినదినమున్ దగుకాలము వేచుచుఁ బ్రిమ్మరుచుండిరి దుర్మతులై. 62

మ. ఒకనాఁడాన్మపమహాళి యోగ్యసమయం బూహించి యభ్యంగక
ర్మకళాకోవిదు జెట్టి నొక్కరుని వే రావించి మాణిక్యచి
త్రకిరీటాంగదకుండలద్వయ వినూత్నస్ఫారహారావళుల్
ప్రకటాక్షీయ మనోజ్ఞపీఠతటి యోరం బెట్టి తా నొక్కెడన్. 63

వ. అంత మల్లకరతలోల్లసితసంవాహనసుఖపరవశుండై యుండునంత.

కం. సందుగని సచివులధిపుని
పొందుగఁ బీఠముఁ నిడినభూషణములు చే
కొం డిగిచిడాఁప లంచం
బందిన యొకబోటిఁ బనిచి రతిపూహకులై 65

కం. పనిచినఁ బేటిక నసిచిన
ఘనరత్న విభూషణములు గైకొని జరరాం
గన యొకమఱుఁగున డాఁచెన్
దనదుర్వినయప్రపంచదశ నింద్యముగన్. 66

మ. నరనాథాగ్రణియున్ బవిత్రసలిలస్నానమ్ము గావించి భా
సురపట్టాంబరధారియై బుధజనస్తోత్రవ్య దివ్యసలా
కరజ శ్వేతమృదూర్ధ్వ పుండ్రరచనాక్రమానసాంభోజుఁడై
తిరుమంత్రంబు జపించి చెంత నొకయింతింజూచి పల్కెన్ వెసన్. 67

తే. గీ. నాతి తడవయ్యె మద్భూషణములు పీఠ
తలమునందిడి వచ్చితి మలయ కిపుడ
పొమ్ము తెమ్మంచుఁ బలికిన భూవరేణ్యు
నాజ్ఞ వేవేగ నటకేగి యంబుజాక్షి 68

తే. చేసి యవనికాదికిఁ గామ్ముతృలు
కి నివెంపకయున్న రాజశేఖరేంద్రు మనము
బున వెఱఁగుఁ జెందె నంతయు
వినిపించిన నవ్విభుండు విస్మితుఁడై కనుమన్. 69

చం. నరవరుఁ డాత్మకోశమున నవ్యవిభూషణపంక్తి లేమిఁ దా
నరసి సమీపవర్తులగు నాప్తుల నెల్లెడఁ జాటఁ బంచి తాఁ
సరసియుఁ దోషపుంజములయుఁ జయ్యన మంత్రిగణమ్ము గాంచి యం
దఱు వినఁ నిట్లు పల్కె మది దద్దయు నద్భుత మగ్గలింపఁగన్. 70

ఉ. మంజులపీఠమధ్యమున మన్మణిభూషణపంక్తిఁ బెట్టి య
భ్యంజనతత్పరుండనగునప్పుడు దాని హరించె నెవ్వఁడో
కంజముఖాంతరమ్ముల నిగూఢము చేయునొ వానిఁ దెచ్చి యీ
నెంజలిఁ బాయఁ జేయుటకు నేర్పరులారయ మీరలే కదా ! 71

వ. అనిన నమాత్యులిట్లనిరి. 72

మ. మనుజాధీశ్వర ! దూఱ నేమిటికి మంత్రప్రచారాన్వితుల్
ఘనులో హీనులొ నిశ్చయించి పలుకంగావచ్చునే ! మాకుఁ గాం
చనవాంఛాకృత వంచనామిళిత సౌజన్యమ్ము వాటింతురిం
తననేలా పరికించినన్ దెలియరాదా ! నీదు చిత్తమ్మునన్. 73

కం. అని సచివులు భాషింపన్
విని భూరమణుండు కినుక వెఱసిన చిత్త
మ్మునఁ బల్కె నిచటఁ గంటిమి
ఘనులకుఁ జౌర్యాభిలాష గడలుకొనంగన్. 74

ఉ. నావుడు వార లామనుజనాథునితో మదిఁ గోపగించినన్
బోవునె నిశ్చయించితిమి మున్నిటువంటివి పుట్టునంతు నే
తావులఁ గన్న వైష్ణవకదంబము ద్రొక్కనిచోటు లేదు రా
జావసథమ్ము నందెచటనైన వినంబడ విట్టిచోద్యముల్. 75

ఉ. నాఁడు మనయ్యగాంద్రఁ గఠినస్థితి నెండల నివ్వరించినన్
వాఁడిరటంచుఁ గోపమున వాఁకిటికావలివారిఁ జెండుబిం

దాఁటఁగ నాగ్రహించి చెవులమ్ముల [illegible] నప్పు శే
జాలములవస్తో తెలియునే [illegible]! [illegible] లేశ్వరా! 76

ఆ. వె. అనినఁ జెవులు మూసికొని పాపరతుల మ
ర్త్యచనరచన వినఁగవల సె ననుచు
జనవరేణ్యుఁడపుడు సంతప్తచిత్తుఁడై
కనరుదోఁప మంత్రిజనులఁ జూచి. 77

ఉ. అక్కట శాంతిచిత్తులు మహాత్ములు భాగవతోత్తముల్ మఱిన్
స్రుక్కక వారు చోరులనుచున్ గద యిట్లువచించుకౌర మీ
కెక్కడి సత్యశౌచకథ లెక్కడిధర్మవిచారసౌష్ఠవం
బెక్కడసమర్మదంబొకటి హీనవిచారులఁ జేయకుండు నే! 78

చం. జలరుహపత్రలోచనుఁడు సర్వజగత్పతి వైష్ణవోత్తముల్
దలఁపఁ దదీయపుత్రులుగదా! ధరఁగల్గుధనమ్ము లెల్ల వా
రలవిని గైకొనందగుదు రట్టిదెఱింగి యికేల పెక్కు భా
షలు భగవత్ప్రపన్నులకుఁ జౌర్యము లేదని పాము ముట్టెదన్. 79

కం. అని తెంపునఁ బలికెడి య
జ్ఞపతి వచనములకులికి సచివులు నృప! నీ
కనుచితము బాస ధనఁ గాం
చనవాంఛఁ బొసఁగు నెట్టిజనులకు నైనన్. 80

కం. ఏ[illegible]! వి[illegible]ములు
వ్యాసులవై [illegible] పలుక జనునే! మిట్టిం
తామలినవ్యాపారులు
శ్రీ [illegible] మహి[illegible] చెందిరి [illegible]! 81

వ. అనిపల్కు భాగవతపరిభవభాషణ శ్రవణజనితసంతాపాయితచిత్తు లగు కనుంగొనల నిప్పులుప్పతిల్ల [illegible]లమఖధ్వంసంబును భగవత్ప్రపన్న ప్రభావ ప్రకటనంబును జేయం దలంచి దండ నొకయహితుండికుసిం బిలిచి నీలవర్ణాభీలంబైన వ్యాళంబు నొక్కదానిఁ గొని తెండని పనిచిన వారు నతిక్రూరఘూత్కారఘోరంబైన భుజంగమ్ముఁ బట్టి తెచ్చిన నిజా[illegible]శీయ[illegible] దానినొక్కసూత్రభాండమ్ము

నందుఁ బెట్టించి తానును సింహాసనంబు డిగ్గి చానింబట్టికొన నుద్యోగించునప్పుడు సురగరుడ గంధర్వకిన్నర కింపురుషసిద్ధసాధ్యాదు లాకాశమ్మున నిరవకాశమ్ముగా నిలిచి విస్మయంబునం జూచుచుండిరి హితపురోహిత మంత్రిసామంతవర్గం బిదియేమి పనియని యిమ్మహారాజునకుం దోఁచెనను వారును నెవ్వరిగుణమ్ము లెవ్వ రెఱుంగుదు రిట్టిసాహసమ్మునకుం జొత్తు రేయనువారును నయ్యుండిరంత నమ్మహీకాంతుండు. 82

## స్వాములకు దోషములేమికిఁ గులశేఖరుఁడు పాము ముట్టుట

తే. గీ. చూడు డెల్లవారు శుద్ధాంతరంగులు
భాగవతులు వారిపట్లఁ గలుష
వృత్తి లేదటంచు వెసఁ గేలఁదడవెద
సర్ప మూఱకనికి సాక్షిమీరు. 83

వ. అనిపలికి దయాసముద్రుండగు రామభద్రుం దలంచుచు. 84

కం. చండాశీవిష భీషణ
భాండమ్మునఁ గేలుసొనిపి భయవిరహితుఁడై
యుండిన మండలపతిఁగని
గుండియ లిట్టట్టుచెదరఁ గొనకొని ప్రజకున్. 85

కం. తృణరజ్జులీల వంచిన
ఫణమెత్తకయున్న ఘోరఫణి గాంచి నృపా
గ్రణి యొక్కకడకుఁ ద్రోఁచుచు
మణిముద్రిక డిగిచిచూపె మనుజులకెల్లన్. 86

మ. సురగంధర్వవిహంగపుంగవులు యక్షుల్ సిద్ధవిద్యాధరుల్
ధరణీవల్లభు సత్యధర్మముల కాత్మన్ విస్మయోల్లాస ని
ర్భరులై యాతనిమీఁద దివ్యకుసుమవ్రాతమ్ము వర్షించి ర
చ్చరజోటుల్ నటనాది శేష లలితోత్సాహమ్ము వాటింపఁగన్. 87

ఉ. అప్పుడు మంత్రులెంతయు భయంపడి మేనులు సంచలింప మా
తప్పు క్షమింపుమంచు వసుధావరు పాదములందు వ్రాలినన్
జొప్పడుశాంతిచేఁ బలికె నుక్కివెతంబడ నేల ! స్వాములం
దెప్పుడు భక్తియుక్తిఁ జరియింపుడు దుష్కృతమెల్లఁ బాయఁగన్. 88

వ. శ్రీనివాసనాయకుని కౌంజనంబుల సాధువాదంబు చేసియుక్తలక్షణంబు పేరుల నెసంగె నప్పుడు. 89

## శ్రీమన్నారాయణ సాక్షాత్కారము

సీ. మురువుదీపించు నెమ్మోముజాబిల్లిపై
చిఱునవ్వువెన్నెల చెలువుఁజూప
జిగిదళుకొత్త వాసించుపొక్కిటితమ్మి
బొమ్మవేలుపు జన్మభూమిఁదెలుప
సహజమునఁ గాంచీగుణవ్యాప్తి బొడ్డులో
గలజగములకుఁ బైకాఁపుఁజూప
పొలుచు వక్షోహారముల చందిరఁపుఁగావి
కమలాకుచన్యాసి గణనసేయ

తే. గీ. మంజుకంజాతకింజల్కపుంజ రుచిర
పీతకౌశేయరుచులు మైఁబెరయ విహగ
రాజతురగమ్ము నెక్కి శ్రీరంగరమణుఁ
డమ్మహీవల్లభునకుఁ బ్రత్యక్షమయ్యె. 90

ఉ. మించులమించు వస్త్రరుచిమేచక భూషణరత్నదీధితుల్
మించిపొసంగ నిన్నిఁటినిమించి మురాంతకుదివ్యతేజమున్
గాంచుటకుం దలంకెడుమనంబు నొకించుకనిల్వరించి సే
వించె నృపాలమౌళి యరవిందదళాక్షుని పాదసన్నిధిన్. 91

తే. గీ. ఇట్లు ప్రణమిల్లి యతఁడు లక్ష్మీశునెదుట
నిటలతటమున నంజలిపుటముఁ జేర్చి
సమ్మదాశ్రులు కన్నులఁ గ్రమ్మ దేఱ
సవినయమ్ముగ నిట్లని సన్నుతించె. 92

చం. మనసిజగర్భశంకరకృశానుశతక్రతుముఖ్యసేవ్య ! భా
సురమహిమాలవాల ! పరిశోభితభూరియశోవిశాల ! దు
ష్కరదనుజవ్రజోగ్ర బలఖండనపండితకాండజాల ! సు
స్థిరనిగమాంతసంచరణశీల ! సుధీజనపాలనప్రియా ! 93

తరం జేయుచుండెచ్చు రాజత్రిభాద్వారదేశంబు [illegible] దేశ[illegible]
బెర్చి దంభోళిధారాధికారంబు సాధింపనింపించు [illegible]
దున్మత్తుఁడై తత్పుత్రు సత్యంత సౌభాగ్యసంపన్నుఁ జేసి [illegible]పవే!
తొల్లి యుగ్రుండు బలీంద్రుండు చండప్రతాపానలజ్వాలలం గ్రమ్మి
నాకాదిలోకమ్ములన్ స్విల్వఁగానీక ఘోరాటవిం జెందఁగాఁ జేయుచున్
బూజ్యమానక్షితి స్వర్గరాజ్యమ్ము తాఁ జేయు [illegible] స్వప్రస్థానావాక్య
సంతుష్టచిత్తుండవై వామనాకారవేషాన [illegible]
నాకంబు జపస్థానమ్ము గావించు మహాయజ్ఞ[illegible] ప్రసాదించి
నైకొన్న చోఁ బాదముల్ పెంచి బ్రహ్మాండగోళంబు పాదద్వయంబుగా[illegible]
దైత్యేంద్రు నోడించి స్వారాజ్య మింద్రాదిబృందారకుల్ మెచ్చఁగా నిచ్చి
పోషించవే! యింకమున్నార్తవిఖ్యాతనాదిక్షమాభర్తలత్యంతగర్వోద్ధతిన్
ధర్మవిధ్వంసమున్ జేయఁ గోపించి నివయ్యోడన్ జామదగ్న్యుండవై పుట్టి
పాపక్రియోపార్జనుండైన యయ్యర్జునుం దాఁకి తద్బాహుసాహస్రముల్
తత్కిరీటోజ్జ్వలంబైన శీర్షంబుతోడన్ [illegible]గ్రధారాహతిం ద్రుంచి
గర్వాంధరాజన్యకధ్వంసమున్ జేసి భూభారమున్ మాన్పవే మున్ను
లోకైకసంరక్షణం బాచరింపన్ విరించాదిసంప్రార్థనం జెంది ధాత్రీస్థలిం
గోసలేంద్రాగ్రభార్యాలసద్గర్భసంభూతి వాటించి శ్రీరామనామంబునన్
బూర్ణచంద్రాకృతిన్ సొంపు దీపించి ఘోరధ్వనిధ్వస్త నానాపురగ్రామ
శృంగాటకం దాటకం ద్రుంచి సంగ్రామికోత్సాహు నత్యుగ్రదేహున్
సుబాహున్ ధరన్ గూల్చి మారీచు నంభోధివీచీనిమగ్నాంగు గావించి
మౌనీంద్రుయాగమ్ము సౌభాగ్యయోగమ్ముగా వించి వేఱొక్కచోటన్
మునీంద్రోగ్రశాపమ్మునన్ గ్రావరూపమ్మునన్ గానవాపన్నయైయున్న
యహల్యాని దేవిన్ గృపాదృష్టి నీక్షించి నీపాదపద్మద్వయీపాంసులేశమ్ము
నన్ దోషనిర్ముక్తయై తొంటిరూపమ్మునం జెంది తద్భర్తృసంభోగ
సౌఖ్యమ్ము నొందింపవే! శంకరోదగ్రకోదండదండమ్ము ఖండమ్ముగా నట్లు
గావించి లోకైకవిఖ్యాతలక్ష్మీప్రకాశాజాతయౌ సీతఁ బెండ్లాడి క్రోవస్ని
రోధించినన్ భార్గవుం దోలి సాకేతముం జేరి నీవంత మాత్రంతరద్వేష
యోగంబునన్ రాజ్యసౌఖ్యాభిలాషమ్ము చాలించి సమ్యగ్గుణోపేతయై
యొప్పు సీతామహాదేవియున్ బ్రేమ దీపింప సౌమిత్రియుం గొల్వఁగాఁ
దాపసాకారవేషాఢ్యుఁ గాంతారవీథిన్ విరాధున్ ఖరున్ దూషణాద్యుగ్ర
దైతేయులం ద్రుంపవే! రావణుం డంత దుస్తంత్రుఁడై ధారుణీకన్యఁ

గొంతవోయి లంకాపురారామసీమన్ జెజ్జవెట్టుటన్ చివ్ర సుగ్రీవసాం
గత్యమింపొందఁగాంచి రౌద్రమ్మునన్ వాలిఁ దూలించి సుగ్రీవు
రాజ్యాభిషిక్తోజ్జ్వలుం జేసి తత్సంగతిన్ వార్ధిబంధించి లెంకన్ మహా
మత్తవిభ్రాత్సు [illegible] ముఖ్యులన్ [illegible] కుంభకర్ణుం
బ్రోద్రజిన్ముఖ్యులం బంచి యుద్ధంబునం [illegible] దైత్యప్రౌఢ
ప్రాణవిధ్వంసముం జేసి సీతాసతిన్ గంధకస్తూరుఁ జంబ్రోచి బ్రహ్మేంద్ర
ముఖ్యుల్ భజింపంగ సీతాసమేతుండవై జాంబవద్వాయుపుత్రాంగదనే
యాంగదాదుల్ వెసంగొల్వ రత్నప్రభాదీప్తపుష్పకారూఢ నేతెంచి
మార్తండవంశావనీశశ్రియం బొంది యయోధ్యాపురంబున్ బ్రవేశించి గంధర్వ
గానంబు రంభాదినాట్యప్రసంగంబులున్ [illegible]నకాదిత్యకన్యాది వరాని
వ్రజంబున్ సునాసీరముఖ్యామరశ్రేణియున్ భూరిభేరీమృదంగాది ఘోష
షమ్ములుం బర్వఁ బర్వేందుబింబంబుచందంబునం గాంతి బెంపొందఁ బట్టాభి
షిక్తుండవై లోకసంరక్షణోపాయచేపాకశోభిల్లవే! యింకనుం దేవకీదేవి
గర్భంబునం బుట్టి పెంపెక్కుడన్ రామకృష్ణాభిధానంబులన్ బెంపువాటించి
క్రేపల్లెలో వల్లవుల్ మెచ్చఁ గ్రీడించుచున్ వెన్నలుం బాలు చౌర్యం
బునం గ్రోలుచో సంపుటై గోపికల్ రంజిలన్ బ్రమోదింపవే!
పూతనాఖ్యన్ దృణావర్తకున్ వత్సదైత్యున్ బకాఘాసురాదిప్రముఖ్యులన్
ద్రుంచి గోగోపకవ్రాతమున్ బ్రోవవే! కాళియాహిన్ మదంబెక్క పాదం
బులం ద్రొక్కి త్రుళ్ళింపవే! వజ్రికోపించుటన్ ఘోరపాషాణవాతాంబు
పాతంబులన్ గోకులం బాకులం బొందఁగాఁ జేయు మేఘవ్రజంబున్ విలోకించి
గోగోపగోపీజనంబుల్ ప్రమోదింప గోవర్ధనోర్వీధరం బెత్తి హస్తాగ్ర
పీఠమ్మునన్ నిల్పి ఛత్రమ్ముగాఁబట్టి యాభీరులన్ బ్రోవవే! గోపికల్
నీవయిన్ మోహవిభ్రాంతిచేఁ జేరి ప్రార్థింపఁ గద్వాంచలీ జేర్పవే! ధర్మ
విధ్వంసునిం గంసు హింసించి మోదంబునన్ దల్లిదండ్రుల్ హితుల్ బంధు
సందోహముల్ సంతసింపంగ వర్తింపవే! కీర్తి మూర్తీభవింపన్ ద్విజ
శ్రేణులన్ బ్రోవవే! మాగధాదిద్విషత్కోటి నిర్జించి శ్రీరుక్మిణీకన్యకం
దెచ్చి పత్నీవతంసంబుగాఁ జేయవే! పాండుపుత్ర ప్రియాకాంక్షివై దుష్ట
చారిత్రు దుర్యోధనుం గూల్పవే చక్రపాణీ! జగన్నాథ! నిన్నున్ భజింపంగ
శక్తుండనే రాక్షసవ్రాతనిర్యాతనేచ్ఛన్ దరీయాంగనాసద్వ్రతధ్వంస
ముం జేయ బుద్ధావతారంబవై కొంటివింకన్ గలివ్యాకులంబైన కాలంబు
నన్ దుర్మదోదగ్రమై మ్లేచ్ఛవర్గంబు దోర్గర్వదుర్వారవృత్తిన్ విజృం

భించి ధర్మక్రియానాశముం జేసి విప్రాదిక ప్రాణిలోకప్రమాదావహంబైన
యత్నంబునన్ మించి బాధించినన్ గాంచి కోపించి నీవయ్యెడన్ గల్కివై
కాదె రంగత్తురంగాధిరూఢుఁడవై భాస్వదుగ్రాసిస్ఫురన్మండలాగ్రంబునం
దుష్టులంబట్టి ఖండించి సన్మార్గముల్ పెంచి లోకంబశోకంబుగాఁ జేసి రక్షిం
పవే! వృష్టిచేఁ దుష్టిగావించి సస్యాభివృద్ధిన్ బ్రజన్ బ్రోవవే! గ్రాహ
సంగ్రస్తమై హస్తిరాజమ్ము ఘోషింపఁగా నెయ్యమేపారనే తెంచి రక్షిం
పవే! కర్మవిజ్ఞానభక్తిప్రపత్త్యాదులం దెద్దియుం జేయఁగాఁ జాల నీపాద
పద్మద్వయంబున్ శరణ్యమ్ముగా నమ్మితిన్ నన్ను రక్షింపవే! భక్తమం
దార! సర్వప్రజాధార! లక్ష్మీవిహారా! నమస్తే నమస్తే నమః. 94

చం. అనుచు నుతించుచున్న వసుధాధిపతిన్ గరుణామృతమ్ము చే
నెనసిన చూడ్కిఁ జూచుచు రమేశ్వరుఁ డాతని మేను పల్లవం
బన మృదులీలనొప్పు నిజహస్తతలంబున నంటుచున్ గుణా
వనరుఁడవీవు నీకు సరివత్తురె! దివ్యులు భక్తియుక్తికిన్. 95

తే. మెచ్చువచ్చితి వేమైన నిచ్చఁగల్గు
వాంఛ దీర్చెద నరవర! వరము వేఁడు
మనినఁ గులశేఖరుఁడు వినయమునఁ బలికె
స్వామి! నీపాదభక్తియే చాలుననుచు. 96

చం. సురనరనాగలోకముల శోభిలుకన్యకలందు విందుమె
వ్వరు సరిరారు రూపగుణవైభవలీలల నీతనూజ కి
ద్ధరనని లోకులెన్నఁగ నుదారగుణాకర! నాదుకన్యకన్
దిరముగ నీకు నీఁదలఁచితిన్ జెలిఁ బెండిలిగమ్ము నెమ్మితోన్. 97

కం. వరమిదియెయనిన నవ్వుచు
హరి యిట్లను నోసుధీజనాగ్రణి! లక్ష్మి
ధరణీనీళాఖ్యలు ము
వ్వురు మత్సతులనుచు నెఱుఁగవో! వేదములన్. 98

తే. ఇపుడు నను రంగమందుండు మటఁజేరి కోర్కె
మదివొడలక్ష్మి నీదుపుత్రియై యుదయమందె

వింటెనరపాల! యే సంతకంబు మున్న
కోరియున్నాఁడ సయ్యంతికిఁ గూఁతుఁబడసెను. 99

వ. అని యభిప్రాయంబెఱింగించిన. 100

కం. రాజు ప్రియమంది యోఖగ
రాజతురంగానుషంగ రంగపతీ! మా
రాజీవేక్షణఁ బెండిలి
గాఁ జేయ ననుగ్రహింపవలయుఁ గృపన్. 101

వ. అనుచుం బ్రార్థించిన నద్దేవదేవుం డట్లన కాని యని యనుగ్రహించినం గార్తాంతికులం బిల్వఁబంచి యారేయి ముహూర్తనిశ్చయంబుగావించి ముక్తాఫల మాలికాభిరామంబును మరకతమణిప్రభాశోభిత స్తంభసంభృతంబును పద్మరాగ శిలాపుంజమంజులసాలభంజికారంజితంబును నగణితమణికిరణభూషితసువర్ణబింబ సుందరకవాటశోభితంబును నగునొక్కమహాసౌధంబమ్మహాత్మునకు విడిదలగా నిరూపించి యచ్చటికివిచ్చేయునట్లుగావించి రుచిరాభీష్టపదార్థంబులు సమర్పించి యంతఃపురంబు శృంగారింపందగువారి నియోగించిన. 102

సీ. రచితసామంతాంగరాగమాటినకటల్
తలఁగఁజేసిరి సభాస్తంభములను
రజమడంగఁగఁ జందనజలంబుఁ జల్లిరి
వీథివీథుల బహిర్వేదికలను
మృగనాభి సలికి కూర్చిరి కప్పురంబున
రంగవల్లికలు గేహాంగణముల
రహిమించు పచ్చతోరణముల నెస నెస
వ్రేలఁగట్టిరి కర్కరీఫలముల

తే. గీ. ధూర్త లెసఁజల్లు పిష్టాతధూళి బోరయు
పటికములనొరసిరి ? [మఱి] పావడముల
ప్రేమ దళుకొత్త నిలిపిరి నృపతిగృహా వి
టంకతటములఁ జిత్రపటధ్వజములు. 103

కం. సరసాన్న పానముల స
న్నరవరుఁడు సమస్తజనమనఃప్రియముగ భూ
సురసంతర్పణ మత్యా
దరమునఁ గావించె విబుధతతి మెచ్చంగన్. 104

చం. ఫలములు జున్ను ఖజ్జములు పాయసముల్ గలమాన్న మప్పడం
బులు వడ లిడ్డెనల్ సగుడమోదకముల్ మిఠాయింపుఁజారు సం
ధిలు ఘృతపూరధారలు తుదిన్ దధిఖండసహాయమేర్పడన్
జెలిమి భుజింపఁజేసె నృపసింహుఁడు బంధుహితార్థకోటికిన్. 105

వ. అంత సమ్మహీకాంతుండు నిజకన్యాసఖులం బిలిచి యిట్లనియె. 106

కం. మీరలిపుడేచని మా నీ
ఈరమణికి నుచితమంగళస్నానాలం
కారమ్ములు గావింపుడు
నారీమణులార! కడు మనఃప్రియమెసఁగన్. 107

వ. అని యాజ్ఞాపించిన నవ్వేలందులమందగతిం జని యొక్కమణిమాలి కాలంకారసురుచిరంబగు మందిరంబునందు సముచితపీఠమ్మునం గూర్చున్నయన్నెలంతం గాంచి దాయంజని యిట్లనిరి. 108

శా. ఏవేళన్ మదిఁగూర్తు వాఘనుఁడు తానేతెంచె మీతండ్రి సం
భావించె న్నినుబెండ్లిసేయఁగ శుభాంభస్స్నాన శృంగారముల్
గావింపన్ మముఁబంచినాఁడిచట నాలస్యమ్ముగానీక రే
లేవమ్మా రుచిరాంగి! నీవిభవ ముల్లేఖింపలేరెవ్వరున్. 109

కం. అనుచు నృపకన్యఁ దోడ్కొని
చని యొకపీఠమున నునిచి జలజేక్షణ లో
య్యాన సభ్యంగస్నానం
బొనరించిరి పరిమళప్రయుక్తజలములన్. 110

కం. ఒడలు తడియార్చి పొంకపు
కెడలని నునువలువఁ గట్టనిచ్చి నెఱికురుల్

[illegible]
[illegible] 111

మ. [illegible]
త్రిరుచుల్ చెక్కులఁజేర్చి [illegible]
స్ఫురణం [illegible] మాణిక్య [illegible] శోభిలన్ [illegible]
తరుణి [illegible] మహాశ్చర్యత్వరన్ [illegible] 112

తే. గీ. హార తాటంక [illegible] కటక
కాంచికా హంసకమ్ములతోఁ గదలుకొనఁగఁ
దనరు రాజన్యకన్యకఁ గనకపీఠి
నునిచి పాటలవాసిని వనజముఖులు. 113

వ. అంత మహాకాంతులు [illegible] మంగళస్నానాలంకారాద్యుపచారంబులాచరింపందగిన పుణ్యాంగనలను వేదవేత్తలగు విప్రవరులం బంచిన వారలమ్మహోత్సవసందర్శించి వచ్చినకార్యంబు తెఱంగెఱింగించి [illegible] కొని. 114

ఉ. మోము చెమర్పఁ గన్నులఱ మోడ్పు వహింపఁ గచప్రసూనముల్
వేమఱు జాఱువాఱఁ గుచవీథిఁ దొరంగి సరుల్ నటింప హ
స్తామితరత్నకంకణచయధ్వని సొంపువహింప నొక్క కాం
తామణి నేర్పుచే సురభితైలమునం దలయంటె శౌరికిన్. 115

కం. ప్రాంచద్బహుమణి కీలిత
కాంచనకలశోదకములఁ గడువేడుక దీ
పించి జలకమాడించిరి
పంచాననమధ్య లబ్జపత్రాక్షునకున్. 116

సీ. వనితయొక్కతె సప్యకనక [illegible] తాంబూలం
బందిచ్చె లోకైకసుందరునకు
తరుణియొక్కతె ఫాలతలమునఁ గస్తూరి
రేఖఁ దీర్చె వినమ్రలేఖునకును

సుదతియొక్కతె సంకుమదమ్ముదుశ్రీగంధ
మలఁదె భక్తాభీష్టఫలదునకును
జెలియొకర్తు మకుటకుండలముఖ్యభూషణో
త్కర మొసంగెను సుధాకరముఖునకు

తే. గీ. వెలఁదియొక్కతె సుమమాలికలు మురారి
కంఠమునఁ జేర్చె వేఱొక్క కంబుకంఠి
పసిఁడిపావాలు దొడిగె శ్రీపతిపదములఁ
జికిలిముకురమ్ముఁ జూపె వేఱొకతె హరికి. 117

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశినులప్పురుషోత్తము నలంకరించి మణివిచి
త్రరుచివిలసితంబగు నొక్క సమున్నతకనకపీఠమ్మునందునిచి మహీసురమంత్రో
చ్చారణరవంబులెసఁగం గొలిచియున్నంత. 118

సీ. అరుదెంచె గరుడంచలాంచితహంసాశ్వ
సాదరుండగు సారసోదరుండు
చనుదెంచె శుభ్రాభ్రసముదగ్ర వృషభైక
వాహితుండగు నీలలోహితుండు
నేతెంచె గతిచాతురీ హితారోహణో
చ్చైశ్శ్రవుండైన వృద్ధశ్రవుండు
తరలివచ్చిరి మరుద్వరుణవహ్నికుబేర
ముఖులు శ్రీహరిపదాంభోజసఖులు

తే. గీ. సవుడు చేరిరి గంధర్వు లప్సరసలు
రంగవల్లభు పరిణయారంభ మెఱిఁగి
యందఱుచటనుపటు తెంచి రథివుఁగొలుప
జయవిజయ శేషభుజగేంద్ర సైన్యపతులు. 119

కం. పెక్కండ్రు విబుధశేఖరు
లొక్కటఁ దను జుట్టి కొలిచియుండఁగఁ దేజం
బక్కజముఁగ హరియొప్పెఁ
జుక్కలలోఁ జందురుండు శోభిలు భంగిన్. 120

ఆ. వె. కేరకేశ్వరుండు కేశవుస్తోత్ర వి
చ్చేయవలయు దశస్త్రసేయవలదు
పరమహంసాత్మవేళ పచ్చుచున్నది
యనుచు జెప్పవిచె నచ్యుతుండు. 121

నీలాకల్యాణము

కం. జనపమని పలుకులెస్సక
విని రంగవరుండు చిత్తవృత్తులలర ము
న్ననువర్తించిన సురవర
మునిసంఘముతోడఁ గదలె ముదమొదఁ బొరలన్. 122

వ. ఇవ్విధంబున జగచ్ఛరణ్యుండగు శ్రీరంగవరేణ్యుండు సంఛాదితవిచిత్ర వర్ణోదీర్ణకుథాంచలవిలంబిత చంచత్స్వర్ణమాలికాశోభితోభయపార్శ్వభాగంబును జిరత్నరత్నకింకిణీరుచిరసూత్రసంవేష్టితశింజానచతుశ్చరణంబును సుధాంశుకరనిభోదంతదంతంబునునగు దంతావళంబు నారోహించె నప్పుడు. 123

సీ. అంకుశమ్ముధరించి యహిహంత యంతయై
ఘనగజస్కంధభాగమున సమరి
శేషుండు ముత్తెంపుజగజంపు జిగిపెంపు
తళుకులగొడుగుచందము వహింప
కనకవేత్రము పూని గజిబిజి యడఁప వి
ష్వక్సేనుఁ డగ్రదేశమున నడువ
సరవి నిర్వంకల జయుఁడును విజయుండు
రహిమించు దెలిచామరములు వీవ

తే. గీ. బ్రహ్మరుద్రాది సకలసుపర్వవరులు
కదిసి యేతేఁ గరదీపికాసహస్ర
దీప్తపథమున విచ్చేసె దేవదేవుఁ
డమితవాదిత్రఘోషమ్ము లతిశయిల్ల. 124

తే. గీ. సరససౌరభ మృగమదసాంకవాసి
కలితచందనతాంబూలములు వసిండి
పళ్లెరమ్ముల నిడుకొని ప్రమదమెసఁగఁ
బుణ్యకాంతలు చనుదేర భూవిభుండు, 125

వ. బంధుజనసహితుండై వివిధవాద్యరవమ్ములు పిక్కటిల్ల ముచుకుంద వరదు నెదుర్కొని. 126

చం. మృదులసుగంధచూర్ణములు మేనులపైఁ గుఱియించి యందఱన్
గదిసిన వోఁ ప్రపాలుఁడు జగత్పతికిం గలపంబలంది స
మ్మదమున సూనమాలికల మానితలీల నలంకరించి సొం
పొదవ విరించిరుద్ర పురుహూతమునిద్విజులన్ గ్రమమ్మునన్. 127

వ. సముచితపూజావిశేషమ్ములం బత్నీసహితులగువారలకుం బ్రియంబు నెఱపి యందఱం దోడ్కొని చన నగరవీథిం గ్రమ్మకొను రంభాద్యప్సరోగణమ్ముల నృత్తప్రకారమ్ముల వీక్షింపుచు మందగతిం జనునప్పుడు భేరీపటహభాంకారఘోష మ్ములును గాహళి వేణువీణాగానస్వానమ్ములును దిశలం బర్వె నయ్యవసరమ్మున 128

సీ. తుంబురునారద స్తుతగీతరసలీల
భౌమగాయక గానఫణితి గాంచె
రంభోర్వశీకృత ప్రచురనాట్యవిధంబు
నగరవేశ్యానృత్త నయుత నెనసె
ఆంగీరసోదీరితాగమస్వరసిద్ధి
నగరద్విజోచ్చారణతఁ బొసంగె
సురకంఠమందారసూన సౌగంధ్యంబు
జనధృతప్రసవవాసనల నొదిగె

తే. గీ. మఱియుఁ గౌబేరనిలయు సంపత్ప్రభావ
మానృపతికోశగృహలక్ష్మి ననుసరించె
వింతగాదిది శ్రీరంగవిభుని కరుణ
కలిగెనేనియు నఘటు ఘటముగలదె. 129

వ. ఇత్తెఱంగున రంగవల్లభుండు మహీసురస్వస్తివాచనంబులతో నంతః పురంబు సొచ్చి మొగసాల నేనుంగుడిగ్గి సేనాపతికరంబవలంబించి కక్ష్యాంతరంబులు గడచి విరించిప్రభృతులు పొదివికొనిరా నేతెంచి ముందట నతివిచిత్రపాంచాలికా సముదంచిత స్తంభాభిరామంబును బరిస్తీర్ణమనోహరణాస్తరణశోభితంబునునగు కల్యా ణావసథంబు నగు మొగంబునం బ్రవేశించి సపరివారంబుగా నాసీనుండై యున్నంత. 130

తే. గీ. అపుడు నగరి పురోహితు లమరఁ గురువ
శిష్టముఖ్యమునీంద్రులచే ననుజ్ఞ
గాంచి యుచితస్థలంబునఁ గనకపీఠి
తోపకరణమ్ము లునిచి మంత్రోక్తి తెసఁగ. 131

కం. వైవాహికసమయోచిత
పావనపీఠమున రంగపతి నునిచి యిఁకన్
వేవేగఁ గన్యఁ దోడ్కొని
రావలయునటంచుఁ బలుక రాజు ప్రియమునన్. 132

కం. చెలులఁ గని కన్యకామణి
నెలమిన్ దోడ్తెండు మీరలిపుడని పనుపన్
జలజాక్షులు వేగమె చని
కలవాణిం గాంచి ప్రేమ గడలుకొనంగన్. 133

చం. మతిమతి మాలతీసుమసమానశరీరిణి ! మంజుభాషిణీ !
కుతుకమెలర్ప లోకములకుం బతి నీపతియయ్యె, నయ్య నీ
కతిహితమాచరించె సముదంచితమయ్యె విరించిలేఖ ము
న్నతనుఁడు నిన్ను నేఁచె నిఁక నాతని నేఁచెదవమ్మ క్రమ్మఱన్. 134

తే. గీ. అనుచుఁ గించిదవాఙ్ముఖియైన రాజ
కన్య కరమూఁది తిగిచి యగ్గలికమిగులఁ
బొదివికొని వచ్చి చూపఱద్భుతము నొందఁ
దండ్రిముందట నునిచిరి తలిరుబోండ్లు. 135

తే. గీ. అంత సంకల్పతంత్రమంత్రాదివిధులఁ
బరగ వైదికముఖ్యు లేర్పడఁగఁ జేయ
సరవిఁ గూర్చున్న యవ్వధూవరుల కపుడు
నడుమఁ దెఱఁబూనిరి భవుండు నళినభవుఁడు. 136

కం. జనపతి పసిండిపళ్ళెర
మున రంగేశుని పదాబ్జములు నిలిపి ముదం
బున శుభజలములఁ బ్రక్షా
ళనమొనరిచి మౌళిఁ దజ్జలమ్ము వహించెన్. 137

కం. దర్పకుఁడు విరిశరమ్ములఁ
దర్పంబెడయయ్యె ననుచుఁ దలఁక మహీశుం
డేర్పడ నొగి మధుపర్కం
బర్పించెన్ రంగపతికి నర్కద్యుతికిన్. 138

కం. నరనాథుఁడు ప్రాగ్జ్యోతిష
ధరణీశుండొసఁగు గంధదంతావళమున్
హరికి సమర్పించెఁ బురం
దరుఁ డిచ్చిన కల్పకుసుమదామమ్ములతోన్. 139

కం. ఆరట్టవిభుఁడు మును దా
కోరినక్రియ నిచ్చు చటులఘోటకముల ల
క్ష్మీరమణునకిచ్చెన్ మది
గూరిమి దళుకొత్త రత్నకుండలములతోన్. 140

వ. మఱియుం గులశేఖరధరారమణుండు మదింబొదవుముదంబు తుది గానంబడక జగద్వల్లభుండైన యల్లునకుం బరార్థ్యహారకిరీట గోహిరణ్యాదిపదార్థంబులు సమర్పించె నంత వధూవరులకు మఱుంగుపడ నెసంగు తెఱ వీడంజేసిన. 141

సీ. రంగవల్లభు చూడ్కి రమణిమోమునఁ జెందె
సతిచూడ్కి విభుపదాబ్జమునఁ బెనఁగె
వరుచూపు బోటి కంధరమున విలసిల్లె
చెలిచూపు హరియూరువులఁ దనర్చె
కాంతువీక్షణ మింతిఘనకుచమ్ముల వ్రాలె
నాతివీక్షణ మీశు నాభి నెసఁగె
పతిదృష్టి సఖినితంబములపైఁ బ్రాపించె
యువతిదృష్టి మురారియురము బ్రాఁకె

తే. గీ. నాథుని విలోకనమ్ములు నాతి యూరు
జానుజంఘాదులకు డిగ్గెఁ జంద్రముఖి వి
లోకనమ్ములు భర్త బాహాకపోల
నయననిటలావలంబనోన్నతికి నెసఁగె. 142

తే. గీ. రంగపతి తన్నుఁ జూచిన రమణిమోము
వాంచు నతఁడొందుజూచినఁ గాంచుమఱల

హంసముఁలు ఖంజరీటమ్ము లందిడించి
మొనసి డాఁగురుముూఁతలాడిన విధముస. 143

కం. సంగతి జగములకెల్లన్
మఁగళదుఁ బనుచు జనులు మదిమెచ్చఁగ నీ
ళాంగన కంఠంబున హరి
మంగళసూత్రమ్ముగట్టె మది ముదమెసఁగన్. 144

ఉ. అంచితహేమపాత్రముల నక్షతముల్ దగ నాణిముత్యముల్
నించి నిజాప్తులిర్గడల నిల్చిన దంపతులింపుమీఱ ల
క్షించి చలించుదోయిళులఁ జేర్చి పరస్పరమాళులొప్పఁగా
నుంచిరి ముద్దులేనగవు లూఱెడుమోములు సొంపుగుల్కఁగన్. 145

చం. పదపడి వహ్ని నేల్చి తనపాణితలమ్మునఁ బద్మగంధికే
ల్మోదమునఁ గీలుకొల్పి ద్విజముఖ్యులు మంత్రములుచ్చరింప నం
బుదముపిఱుందఁ గ్రొమ్మెఱుఁగు బూనినరీతి లతాంగితోడ సా
ఖ్యదహుతభుక్ప్రదక్షిణము కైటభవైరి యొనర్చెనయ్యెడన్. 146

వ. ఇత్తెఱంగునఁ గ్రమక్రమంబున వివాహకార్యక్రమంబు నిర్వర్తించి యొక్కమణిమంటపమ్మునందు సువిశాలమనోహరంబైన కుసుమతల్పమ్మునందయ్యి రువురుదంపతుల నునిచిరి. పుణ్యాంగనల జయమంగళంబను పాటల రవంబెసంగ వేణువీణాపణవాదివాద్యఘోషమ్ములుపికటిల్లె గంధర్వగానంబువినంబడియెనచ్చ రలుపెచ్చుపెరిఁగి తమహెచ్చులమెచ్చులెఱుంగుటకు విచ్చలవిడి నటనమ్ముసలుపం దొడంగిరిట్లు మహావిభవమ్మునం దేజరిల్లుచున్న శ్రీరంగవల్లభుం జూచి. 147

సీ. ఘటితరత్నచ్ఛటాజటిలహాటకమైన
మకుటమ్ము గమలసంభవుఁ డొసంగె
మంజురోచిఃపుంజ రంజితాభ్రంబైన
పచ్చలపతకమ్ము భవుఁ డొసంగె
మందారగంధసంబంధ బంధురమైన
హారవారము సునాశీరుఁ డొసఁగె
మానితాంబుజరాగ మణిమండితములైన
కుండలమ్ములు మృగాంకుం డొసంగె

తే గీ. వహ్నివరుణాది దిక్పతుల్ వసనభూష
ణాదిసంభావన లొనర్చి రలవుమెఱసి
రందఱును నవ్యతులసికాహస్తులగుచు
మంత్రపుష్పమ్ము సంగిరి మాధవునకు. 148

సీ. సగముకల్వలజేని సరివచ్చు నుదుటిపైఁ
గ్రమ్మ కస్తురితిలకమ్ము దనర
కెమ్మోవిరుచిగ్రమ్మి కెంపులకై వడి
ముక్కఱముత్తెముల్ మురువుసూప
రహిమించు చెక్కుల రవల తాటంకముల్
మితిలేని ధగధగద్యుతి నెసంగ
కుంకుమంబలఁదిన కుచకుంభయుగళిపై
మణిహారపంక్తి సంపదవహింప

తే. గీ. సిరులెనయుచూడ్కి పొదల ముంగురులు గదల
పసఁపుజిగిచీరమెఱయఁ బూఁబొన్పుమీఁద
ఘనునిచెంగట రాజన్యకన్యఁ జూచి
విబుధకాంతలు సిగ్గెత్తి వెల్లనెరి. 149

తే. గీ. భారతీపద్మసంభవుల్ పార్వతీత్రి
పురహరులు శచీపురందరులు మొదలు
సురవరోత్తము లవ్వధూవరులచేత
మిథునతాంబూలములు గాంచి రధికలీల. 150

కం. అంత వసంతములాడిరి
పంతములిగురొత్త విబుధపతు లచ్చరలున్
వింతగ సామంతులునటఁ
గాంతలతో చల్లుపోరు గావించిరొగిన్. 151

వ. ఇట్లు కృతోత్సవలీలావిశాలుండగు కులశేఖరనృపాలుండు కార్తాంతికులవలన దంపతులనొకటిసేయుటకు ముహూర్తమ్ము నిశ్చయించి తత్సమయంబగుటయు నయ్యూరుపుర సముజ్జ్వలాలంకారశోభితులంగావించి గంభీరస్తంభసంభాసమానమ్మును విచిత్రచిత్రపుత్రికామనోహరకుడ్యమ్మును వినూత్నపల్లవతోరణోల్ల

సితపురోభాగంబున వివిధవర్ణోపరినిబద్ధవితానవిలసితమ్మును వితానపర్యంతలంబమాన విద్యోతమానఖద్యోతసదృశసమ్మృష్టమణిమాలికాలంకృతమ్మును నగునొక్కరమణీయ మంటపమధ్యంబునందు. 152

తే. గీ. పచ్చరాగోళ్లు పవడంపుఁ బట్టియలును
పట్టువఱచిన సునుపట్టు పట్టెడలును
దనరు పర్యంకపాళి మందారకుసుమ
పుంజములు మంజులాకృతిఁ బొందుపఱచి. 153

కం. పొందుగ ఫలభక్ష్యమ్ములు
చందనకస్తూరికానుమంగభరణికల్
సుందరతల్పప్రాంతము
నందునిచిరి చంద్రవదన లతిమోదమునన్. 154

వ. అయ్యవసరమ్మున. 155

కం. వాచస్పతియు వసిష్ఠుఁడు
శోచిష్కేశుండు తగినచోటుల మంత్ర
శ్రీచతురతఁ జూపిరి సమ
యాచారవిచారకార్య మనుకూలముగన్. 156

కం. వాణియు శర్వాణియు గీ
ర్వాణాధిపురాణి గూడి రాణించు గుణ
శ్రేణిఁ దనరు నీళాక
ల్యాణిం దోడ్కొనుచుఁ జనిరి హరియున్నెడకున్. 157

వ. ఇట్లు దోడ్కొనిచనుదెంచి శ్రీవత్సాంకు పర్యంకసమీపమ్మున నిల్పి యిట్లనిరి. 158

ఉ. బొంకుటనేర దర్థిజనపోషణతత్పర సత్యధర్మని
ష్పంకచరిత్ర వృద్ధగురుభక్తిసమన్విత శీలసత్క్రియా
లంకృత కీర్తిశాలిని విలాసమనోహర తావకైకమో
హాంకురఖిన్నహృన్నళినయై యిటులున్నది రంగవల్లభా ! 159

ఆ. వె. సరసవచనరసిక ! సకలపతివ్రతా
తిలక మీమృగాక్షి దేవ ! నీదు

పత్నులందు మెచ్చుపడనేర్చు నీముద్ద
రాలి మనసుదెలిసి యేలికొనుము. 160

కం. అని యప్పగించి దేవాం
గనలు నగవులొదవు వదనకమలమ్ములతోఁ
జనుటయు రంగేశ్వరుఁ డ
జ్జనపతిసుతవలనఁ గేలుసాచెన్ బ్రీతిన్. 161

ఉ. జృంభితభర్తృమోహ మొకచెంత నలంత ఘటింప నద్భుతా
రంభితయౌ నపత్రప భరమ్మున నిల్వఁగలేక యంటప
స్తంభము మాటుకుం జనినఁ దత్పరిరంభవిలోలచిత్తసం
రంభమునం గదుంగొనుచు రంగవిభుం డెలనవ్వు మీఱఁగన్. 162

కం. విరిపాన్పు డిగ్గి రంగే
శ్వరుఁ డయ్యరవిందగంధి జాడఁజని త
త్కరపల్లవమ్ము నిజకర
సరసిజమున నూఁదినగ వెసఁగ నిట్లనియెన్. 163

కం. ఇదియేమే శుకవాణీ!
మదనాయాసమున నీవు మగువననుప నే
నొదవిన విరహశ్రమమున
గదియం జనుదేర, నెట్లుగాఁ దొలఁగితివో! 164

వ. అనిపల్కి యయ్యతిం గౌఁగిటంజేర్చి పూఁబాన్పునకుం దెచ్చి మఱి యనుమృదుమధురసల్లాపమ్ముల నబ్బోటి వుయిలోటఁదీర్చి రంగవల్లభుండు. 165

సీ. శశిబింబమెంతనఁజాలు పూఁబోడి నె
మ్మోమ్ముపైఁ గదియంగ మోముఁజేర్చి
పసిఁడిచాయల డిందుపఱచుఁ జక్కనిచెక్కు
టద్దముల్ కళలంట ముద్దులిడియె
మృదులబింబఫలంబు నదలించు సఖమోవి
నలరు సుధారసం బానఁదొడఁగె
గజకుంభముల గెల్వఁగడఁగు పీనపయోధ
రంబుల నఖలాంఛనంబు లునిచె

తే. గీ. విరులు క్రొమ్ముడినునిచె ముంగురులుదడసె
ప్రబ్బి మేనులఁ బులకాంకురమ్ము లెసఁగ
మరునిచెయ్వులఁ జొగ్గొన్న మమతకతన
రమణి నీవికిఁ జెయిసాచె రంగవిభుఁడు. 166

తే. గీ. వ్రీడ పెంపున సయ్యింతి విభుని కేలు
తనకరమ్మున బిగఁబట్టుకొనిన నగుచుఁ
జెలియ చిబుకంబు నిమురుచుఁ జెలిమి నెరపి
రంగరమణుండు కేలి యనుగ్రహమువడసె. 167

వ. ఇట్లన్యోన్యబద్ధానురాగులగు సయ్యిరువురు సురతవిశేషవిహారమ్ముల మెలంగునప్పుడు చెదరినతిలకమ్ములును జిక్కువడినహారమ్ములును సడలిన కేశకలాపమ్ములును ముదురులగునూర్పులును గలిగి పరిశ్రాంతస్వాంతులగుచుఁ బర్యంకతలమ్మున శయనించియున్నంత. 168

ఉ. చందనశైలదేశమున సంజనితంబగుచున్ సుమవ్రజా
మందసుగంధసంపద సమంజసమై విమలోల్లసత్సరో
బృంద పయఃకణవ్రజము పెంపెసఁగన్ మరుదంకురమ్ము గో
విందుఁడు సుందరీమణియు వేడ్కసుఖింపఁగ వీచె నయ్యెడన్. 169

ఉ. జాతవియోగదుఃఖయగు జక్కవ మెచ్చఁగ మున్నహర్మ్యశి
క్రౌతకు వేళఁదెల్పి విలసద్గతిఁ బద్మినిమేలనన్ మనః
ప్రీతిచెడన్ జకోరకము, బిట్టలుకన్ విటచోరభంగవి
ఖ్యాతములై యెసంగెఁ జరణాయుధకంఠకఠోరనాదముల్. 170

ఉ. అయ్యెడ మేలుకాంచి కమలానన మెల్లన శయ్యడిగ్గి కా
నొయ్యన సంచలింప ముడియూడిన కొప్పు నెఱుల్ నితంబమున్
నెయ్యమొనర్ప సళ్లుకొను నీవి కరంబునఁబట్టి సిగ్గు సం
దియ్యక తోడ్పడంగఁ బడకిల్ వెడలెన్ బదముల్ తడంబడన్. 171

వ. ఇట్లు వెడలిచను నెడ నెచ్చెలులచ్చేడియంగూడుటయు లజ్జాభరమ్మునఁ జిఱునగవు నెఱయు మొగంబెగయింపంజాలక యూఱక చనుచున్న యన్నరపతిసుతం జూచి వారలిట్లనిరి. 172

ఉ. ఏమియుఁ జెప్ప విప్పుడది యేమి సరోరుహగంధి మున్నుగా
నీమది సంచలింప నతనిం గదియంబడి చుక్కనైతొ, యా
ధీమణి ప్రార్థనల్ వడసి తేజముగంటివొ! చైవులన్నియున్
క్షేమముగోరు మాకు నెఱిఁగింపుము సఖ్యమునివ్వటిల్లగన్. 173

వ. అనిన వారలకిట్లనియె. 174

కం. అక్కట క్రొత్తకతలు మీ
రిక్కడ సెప్పెదరు వింటినింతియ సరి యం
దొక్కటియు నే నెఱుంగను
జిక్కులఁ బెట్టంగ నేల చేడియలారా! 175

వ. అనిన సఖులిట్లనిరి. 176

తే. గీ. ఏమియు నెఱుంగననుచు నీవిపుడు మమ్ము
చిక్కపఱిచెదు సరులేలఁ జిక్కఁగొనియె
కుచతటుల నెలవంకలగుంపు మోవి
కెంపు లివియేమి తెల్పవే కీరవాణి! 177

వ. అనియిట్లు సాభిప్రాయవచనమ్ముల నెసంగ మందస్మితాలంకృత వదనారవిందలగుచు నృపాలసుతం దోడ్కొని సముచితకృత్యమ్ములకుం జనిరంత. 178

ఉ. తామరసాకరోత్సవవిధాయి రథాంగవిహంగసంతత
క్షేమసమర్థనమ్ము సువిశేషబుధవ్రజ[వేద]భాషిత
శ్రీమహనీయమై రుచులఁ జెన్నెసఁగెఁ భువనైకదర్శన
ప్రేమరసావలంబ మినబింబము తూఱుపుకొండ కొప్పునన్. 179

కం. సూర్యోదయమ్మునకు స
త్కార్యా[హర్ముఖము లెల్లఁ] గావించి మహా
దార్యధురీణుఁడు హరి దను
నార్యులుగొలువఁగ వరాసనాసీనుండై. 180

చంద్రచందనకళాసౌరభస్ఫురమాణ
వదనవక్షస్స్థవం బెసంగ

పాదాబ్జరాగవిభ్రమరుచిస్ఫురద్ధాటకీయ
లలితాధరాలకోల్లసన మొప్ప
పల్లవాసక్తశోభాగ్రసస్ఫుర
త్సుదనాభిసురుచిరప్రతిభ దనర
శంఖకుంభనిహస్తసౌందర్యయుతిదీప్తి
కింకిణీభావావిలాసగతిమ నొప్ప

తే. గీ. మంజుకేయూరకుండలమకుటహార
ముఖ్యభూషణములు మేన మురువుసూపఁ
దేజరిల్లెడు కరుణావిధేయు నెమటఁ
గాంచె దేవనికాయమ్ము గారవమున. 181

వ. ఇవ్విధంబునం గాంచి చతుర్ముఖశర్వగీర్వాణవల్లభులు దేవమునిసహితులై రంగవల్లభునకుం బ్రణామమ్ములాచరించి ప్రసాదసుముఖుండగు నమ్మహాత్మునిచే ననుజ్ఞాతులై నిజస్థానమ్ములకుం జనిరి కులశేఖరమహీవల్లభుండు నల్లుని యభిప్రాయంబెఱింగి ప్రయాణోచితమ్ములగు చతుర్విధసైన్యమ్ముల సమకట్టంబనిచె మఱియును. 182

చం. ఉరుతరతప్తహేమ కలశోపహితాగ్రము పార్శ్వభాగ భా
సురసురరాజరత్నరుచిశోభితదారుచయమ్ము కేతువి
స్ఫురిత విహంగపుంగవ విభూషిత మద్భుతవేగవాహకం
బురమగు తేరు రంగరమణుం డెదమెచ్చఁగఁ జెంతనిల్పినన్. 183

తే. గీ. అత్తమామలు మ్రొక్కుచు ననుపవెడలి
కనకమయరథ మెక్కె రంగప్రభుండు
ప్రాగ్దిశాశైలశిఖర సంభావ్య మగుచు
భానుబింబమ్ము శోభిల్లు వగిదిదోఁప. 184

తే. గీ. తన్ను నెడబాయు నడలునఁ దాల్మివిడిచి
చిన్నవోయిన పూఁబోణిచిన్నె దెలిసి
జనని భాషించె వగవకే! సరసిజాక్షి!
కోరుకొన్నంత మేలు చేకూరె నీకు. 185

తే. గీ. సతహితుండగు శ్రీరంగనాయకుండు
ప్రేమ నేతెంచి నిన్నువరించినాఁడు
వగుచుఁబడవమ్మ యింకేల వగవ నీకు
జగములకునెల్ల నేలికసానివగుచు. 186

వ. అనియూఱడించి యనేకగోహిరణ్యమణిభూషణాంబరదాసీదాసజనం బులఁ గూఁతుసకరణంబిచ్చి కౌఁగిలించికొని సువర్ణరత్నప్రభాశోభితయగుశిబిక నుంచిరంత. 187

చం. ఘనగజరాజ వాజిభట కంపితభూతలమైన సైన్యముల్
గొని నరపాలశేఖరుఁ డకుంఠితవైభవమొప్పఁ గూఁతుఁ దో
డ్కొనిచన నుత్సహించి తనకుల్ హితవైష్ణవపంక్తి తోడ్పడన్
జననుతుఁడేగె రంగపతిసన్నిధి సన్నిధిగాఁ దలంపుచున్. 188

సీ. పృథుల [ప్రయాణ]భేరీరవంబొక చాయ
విమతుల గుండియల్ వ్రీలఁజేయ
వేణుమర్దళశంఖవీణాస్వనము లొక్క
కడ జనశ్రవణోత్సుకత ఘటింప
వసుధామరస్వస్తివచనస్వరము లొక్క
* * మదెలుప
వందిమాగధ చాటువాగాడ్బటు లెసంగి
యొకచక్కి నాశ్చర్యయుక్తిఁ బెనువ

తే. గీ. మఱియు వారాంగనాగాన మధురనాట్య
భంగు లీక్షించు పౌరప్రసంగ మెసఁగఁ
గుతుకమేపారఁ గుక్కుటకూటసగర
వీథి నల్లన శ్రీరంగవిభుఁడు జనియె. 189

వ. ఇట్లు బహుపరిజనసహితుండును భక్తివినయసంపన్నుండును నగు కుల శేఖరమహీపాలుండుకొలిచిరా రంగవల్లభుండు కతిపయప్రయాణమ్ముల శ్రీరంగ నగరసమీపమ్మునకుం జనునప్పుడు. 190

సీ. ఉచితదివ్యప్రబంధోచ్చారణధ్యాన
భాసురాస్యులు మహాభాగవతులు
రమ్యకర్పూరనీరాజనభాజనో
జ్జ్వలపాణియగు సాధుసముదయమ్ము
మహితకీర్తనాలాపమధురస్వరమ్ములఁ
బ్రకటించుచున్న గాయకవరమ్ము
సురుచిరచ్ఛత్రచామరముఖచిహ్నములఁ
బేర్చి చేకొనివచ్చు భృత్యగణము

తే. గీ. నెమరుననుదెంచి మ్రొక్కుచు నెల్లకడలఁ
గ్రమ్మికొను పౌరసంఘంబు గదిసినడువఁ
జెలఁగి కన్యాజనమ్ములు సేసలిడఁగ
రాజవీథుల విచ్చేసి రంగవిభుఁడు. 191

కం. గవనులు కొన్ని గడచి రం
గవరేణ్యుఁడు రథముడిగ్గి ఘనమణిపీఠిన్
నివసించి యిందిరాసఖు
ల వెసన్ జేరంగఁ బిలిచి లలి నిట్లనియెన్. 192

నీళను శ్రీదేవి పరిగ్రహించుట

కం. వనజాక్షులార! నీళాం
గనఁ దోడ్కొని మీరలిపుడు కమలాలయ ద
ర్శనము ఘటియింపుడన వా
రనుపమగతి నీళతోడ నరిగిరి వేడ్కన్. 193

వ. ఇవ్విధంబున నిందిరాదేవి సన్నిధానంబునకుం దోడ్కొనిచని తత్పాదమ్ములకు మ్రొక్కించిరప్పుడు. 194

తే. గీ. మున్ను వినియున్నకతన నంభోజసదన
తనకు మ్రొక్కిన రాజన్యతనయఁ గాంచి
యొనర దీవించి కౌఁగిట నెనయఁ జేర్చి
యెలమి ముందట నిడుకొని యిట్టులనియె. 195

కం. సేమమె ! సీతలిదంబ్రులల
క్షీమానితమూర్తి మదికి నెక్కినరూపం
బీమహిమ నీకుగలుగుటఁ
గామించె వరించె మేలుగలిగెన్ దరుణీ ! 196

వ. అని పలికిన లజ్జాభయమ్ములనత్తన్వి నెత్తమ్మిఱేకులమొత్తమ్ము నుత్తలపడంజేయుకన్నుల నిలాతలమ్ముఁజూచుచు నెమ్మొగంబెత్తకయున్నచిన్నెయెఱింగి శ్రీదేవియిట్లనియె. 197

తే. గీ. సుదతి ! మోమెత్తి నాపంకఁ జూడవేమి
తొల్లిఁటి తెఱంగు విన సపత్నులము మనము
అక్కచెలియండ్రమనెడి నెయ్యమ్ము గలుగ
వెఱచి యిటులుండ నేటికి వెఱ్ఱివగుచు. 198

మ. అలివేణీ ! శుకవాణి మున్ను మనమయ్యబ్జాక్షు దాస్యమ్ము సం
ధిలఁ గ్రీడించుచునుండువార మిపుడద్దేవుండు రంగేశుఁడై
నిలువన్ బద్మకుడుంగ రాడ్గృహములన్ దీపించియిట్టుల్ సప
త్నులమై కూడెదుభాగ్యమబ్బె హరి నిన్నున్ నన్ను బ్రోచున్ గృపన్. 199

కం. అన నృపకన్యక పలికెన్
జనవొసఁగితి నాదుపూర్వచరితము దెలిసెన్
ఘనతన్నీకడఁ జేరితి
మనమున నాకింకి వెఱపు [మాటయు] గలదే ! 200

వ. అనిన శ్రీదేవి భూపాలకన్యకంజూచి సంతసిల్లుచు నిట్లనియె. 201

కం. అదనిదియె నీదుమదికిన్
గొదువలులేవింకఁ జక్రిగూడి సకలసం
పద లనుభవింపుమేలిమి
పదవే ! పూఁబోడి [వాసభవనమ్మునకున్] 202

వ. అని యయ్యింతి నుత్సహింపఁజేసి సఖులందోడిచ్చి నిజసౌధంబునకుం బనిచె నంత రంగవల్లభుండల్లనల్లన నిజాగ్రమహిషీసమీపమ్మునకుం జనుటయు నయ్యబ్జగేహిని యొక్కింతకినుకనెరయ నతనింజూచుచునిట్లనియె. 203

కం. ఈసారి పెండ్లికూఁతురు
నేసీమం దెచ్చికొనఁగ నిచ్చఁదలఁచితో!
ఆసపడి మానఁగనే
వేసరకుఁడి క్రొత్తచెలుల వెదకెదవనికిన్. 204

కం. నావుడు శ్రీహరి యిట్లను
దేవి వధూమణుల నేను దెచ్చుటలు భవ
త్సేవాపరిచర్యలకుం
గావలెననికాదె! వేఱొకటిఁ దలఁపకుమీ! 205

కం. అప్పలుకులు విని యిందిర
తప్పక విభుమోముఁ జూచి ధర్మాత్ములు మీ
రెప్పటికి [మాయ] లెఱుఁగరు
చెప్పకుడిఁక మేలిపనులు చేసెదరెలమిన్. 206

ఉ. కంఠితవైరి! మున్ను నినుఁగూడి చరించెడివేళలందు వై
కుంఠములోన నీకు ననుకూలసతీత్వ మొనర్చఁగాన యు
త్కంఠత జనించె నింక నొకకన్నియఁ దెచ్చెదవేని దాని నా
కుంఠితములాఁడి రంగపురిలో వెదలింతుఁ జుమీ! జగత్పతీ! 207

వ. అని మేలంబునం బలికి నెమ్మొగమ్మునం జిఱునగవు నెఱయ సగౌరవం గాఁగిలించికొనియె నిట్లయ్యిరువురు చతురసల్లాపరసానుభవమ్ము సేయుచు నాత్మీయ సౌధంబునకుం జనిరి మఱియును. 208

సీ. మంజులోద్యాన ద్రుమచ్ఛాయ లందుండి
శుకకోకిలోక్తుల సొంపు వినుచు
పద్మకైరవసౌరభము లొప్పుకొలఁకుల
సలిలకేళీసముత్సాహు లగుచు
మణిమయప్రాసాద మహితస్థలమ్ముల
రమ్యవీణాగానరసికు లగుచు
కలితమౌక్తికమాలికా డోలికల నెక్కి
లాలితక్రీడావిలాసు లగుచు

తే. గీ. ఘనజనాలోకనానందకారులగుచు
ప్రేమ నీళాంగనారంగధాము లపుడు
బంధురైశ్వర్యసౌఖ్యసంపదలఁ బొదలి
యెలమిఁ జెంపొంది రానందకలన దనర. 209

కం. ఇత్తెఱఁగున నిజపుత్త్రి యు
దాత్తమహాసౌఖ్యభోగదశ గని భూపా
లోత్తముఁడు సంతసిల్లుచుఁ
జిత్తమునం దనపురమ్ము జేరం దలఁచెన్. 210

కం. రంగపతికిఁ బ్రణమిల్లి సు
సంగతమా గతి నతండు సరవి ననుప పు
త్త్రిం గాంచి గారవించి ర
మాంగనకున్ మ్రొక్కి పలికె నతిమోదమునన్. 211

కం. గోముఁనఁ బెరిగినయది మది
నేమియుఁ గాపట్య మెఱుఁగ దెఱుక నొసఁగినన్
బ్రేమగొను నడుగ దెద్దియు
నీమఱువునఁ జెల్లెలనఁగ నిలుపుము వేడ్కన్. 212

ఉ. చల్లనిచూపు లెంము వెదఁజల్లి జగమ్ములఁ బ్రోతువీవ కా
తల్లివి భవ్యవైభవమతల్లివి సేవకకల్పవల్లి! ని
న్నెల్ల బుధుల్ భజించుకతలేమెఱుఁగన్ బసికూన! దీని నీ
చెల్లెలిగాఁ దలంచి కృపసేయుము నేరములేమొనర్చినన్. 213

తే. గీ. అనిన శ్రీదేవినగుచు నోయవనిపాల!
మదిచెదరి కూఁతునప్పగించెదవు గాక
జన్మజన్మమ్ములను విష్ణుసతుల మగుచుఁ
జెలిమినుండెదు మాకిన్ని చెప్పనగునె! 214

కం. అనఘ! భవత్సుత మీగృహ
మున మెలఁగినయట్ల యిచట ముదమున నలరున్
ననుగూడి చెలఁగుచుండెడి
ఘనమున సంతోషమెసఁగ మరలుము పురికిన్, 215

వ. అని పవమానతనయానతిచ్చిన సంతుష్టాంతరంగుండై తన్నుం గృతార్థుం గాఁదలంచుచు సకలపరిజనయుక్తుండై నిజనగరంబుఁ బ్రవేశించె మఱియు. 216

కం. శ్రీవైష్ణవ పూజాగం
భావనలేనుజక రామభద్రచరిత సే
వాపలసితహృదయుండై
భూవరుఁ డాశ్వోకులసరణిఁ బాలుపఱచెన్. 217

సీ. సతతమ్ము పురమున సాటించు భేరీమ్రో
దంగ మెసంగ శ్రీరంగయాత్ర
రచియించె హరిభక్తిరసము జొబ్బిల బుధా
నందానుకూల ముకుందమాల
నిఖిలప్రపన్నవక్తృతముగాఁ బ్రకటించె
బంధురద్రవిడ ప్రబంధ మొకటి
సంతతశ్రీరామచరితామృతాస్వాద
* * క్తిగాంచె

తే. గీ. బహుళ నీవృత్సమాయాత భాగవత జ
నాభినందన గురుసపర్యాభిలషిత
వస్తువిశ్రాణన క్రియావశత నెసఁగె
నతహితుండను నృపసత్ప్రతి సంపదుండు. 218

కం. చిరకాలము భూపాలన
పరుఁడై ...........................
స్ఫురణమ్మున నిజతనయున్
గరమన్ బట్టాభిషిక్తుఁ గావించె నెసన్. 219

వ. ఇట్లు సప్తాంగంబతనివశమ్ముఁ జేసి నిర్భరచిత్తుండై యుండె మఱియును.

తే. వసుధఁ బాలించి శ్రీవైష్ణవప్రియార్చ
నంబు గావించి జానకీనాథుఁ గొలిచి
..........................................రూఢుఁడగుచు
నెమ్మి నృపమౌళి విష్ణుసన్నిధికిఁ జనియె. 221

వ. అని యుత్తరాంగుళం. 222

కం. గురువర్యుఁడు శిష్యునకున్
నిరుపమకులశేఖరావనీవల్లభు స
చ్చరితం బంతయు నేర్పడ
కరుణాం దగ నొసఁగిచ్చి క్రమ్మఱఁ బలికెన్. 223

కం. కులశేఖరాళువారుల
విలసితచరితమ్ము జగతి వినినఁ జదివినన్
గలుషప్రజమ్ము దొలఁగుచు
నెలమిం బ్రాపించు నరుల కిహాపరసుఖముల్. 224

వ. అనిపలికి శిష్యోత్తమా! పరమపవిత్రంబగు కులశేఖరచరిత్రంబు సవిస్తరంబుగా నీకు నెఱింగించితిననుటయు శిష్యుండాచార్యునకుం బ్రదక్షిణపూర్వకంబుగా ప్రణామంబులాచరించి విమలంబులగుకుసుమచందనంబులం బూజించి మమ్ముం గృతార్థలం జేసితిరని యానందరసభరితాంతఃకరణులై విలసిల్లిరి తత్తఱంగున. 225

మ. తరుణీలోలపితృ ప్రక్తిపాలనకళాధౌరేయ! గాధేయదు
ర్భరభవ్యాధ్వరమంత్రతంత్రకలనాప్రత్యూహకృద్దైత్యసం
హార! రంహోభయదాబ్ధిగర్వదళనోద్యద్రక్తనేత్రాంచలా!
ధరధైర్యాఢ్య! ధరాధురాధరభుజా! ధారాధరాంగద్యుతీ! 226

కం. కాకమదోద్రేకతమో
........................................
.................
........................................ 227

మాలిని. ........................

*   *

కలశజనుతిశాలీ క్రమపద్మాక్షమాలీ
విలులితసదవద్యా వేదవేదాంతవేద్యా 228

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణానిరీక్షణసమాసాదితకవితావిశేష శేషాన్వయప్రదీపక వేంకటాచార్యకుమారరఘునాథార్యప్రణీతంబైన కులశేఖరమహీపాలచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము. 229

సంపూర్ణము